# అథ ద్వాదశో%ధ్యాయః

# మయస్తుతి

సనత్కుమార ఉవాచ |

ఏతస్మిన్నంతరే శంభుం ప్రసన్నం వీక్ష్య దానవః | తత్రాజగమ సుప్రీతో మయో%దగ్ధః కృపాబలాత్ || 1

ప్రణనామ హరం ప్రీత్యా సురానన్యానపి ధ్రువమ్ | కృతాంజలిర్నతస్కంధః ప్రణనామ పునశ్శివమ్ || 2

అథోత్థాయా శివం దృష్ట్వా ప్రేమ్ణా గద్గదసుస్వరః | తుష్టావ భక్తి పూర్ణాత్మా స దానవవరో మయః || 3

సనత్కుమారుడిట్లు పలికెను -

ఇంతలో శంభుడు ప్రసన్నుడగుటను గాంచి, శంభుని అనుగ్రహ బలముచే దహింప బడలని మయాసురుడు ఆనందముతో అచటకు వచ్చెను (1). అతడు చెతులు జోడించి శివునకు ప్రీతితో నమస్కరించి, ఇతర దేవతలకు గూడ నిశ్శంకముగా నమస్కరించి, మరల శివునకు సాష్టాంగ నమస్కారమును చేసెను (2). దానవ శ్రేష్ఠుడగు ఆ మయుడు అపుడు లేచి శివుని చూచి ప్రేమతో బొంగురు వోయిన కంఠస్వరము గలవాడై, భక్తితో నిండిన అంతరంగము గలవాడై ఇట్లు స్తుతించెను (3).

మయ ఉవాచ |

దేవ దేవ మహాదేవ భక్తవత్సల శంకర | కల్పవృక్ష స్వరూపో%సి సర్వపక్ష వివర్జితః || 4

జ్యోతీ రూపో నమస్తేస్తు విశ్వరూప నమో%స్తు తే | నమః పూతాత్మనే తుభ్యం పావనాయ నమో నమః || 5

చిత్ర రూపాయ నిత్యాయ రూపాతీతాయ తే నమః | దివ్యరూపాయం దివ్యాయ సుదివ్యా కృతయే నమః || 6

నమః ప్రణతసర్వార్తి నాశకాయ శివాత్మనే | కర్త్రే భ##ర్త్రే చ సంభహర్త్రే త్రిలోకానాం నమో నమః || 7

భక్తి గమ్యాయయా భక్తానాం నమస్తుభ్యం కృపాలవే | తపస్సత్ఫలదాత్రే తే శివాకాంత శివేశ్వర || 8

న జానామి స్తుతిం కర్తుం స్తుతిప్రియ వరేశ్వర | ప్రసన్నో భవ సర్వేశ పాహి మాం శరణాగతమ్ || 9

మయుడిట్లు పలికెను -

దేవ దేవా! మహా దేవా! భక్తప్రియా! శంకరా! కల్పవృక్ష స్వరూపుడవగు నీకు స్వపర భేదము లేదు (4). జ్యోతిస్స్వరూపుడవగు నీకు నమస్కారము. జగద్రూపుడవగు నీకు నమస్కారము. పవిత్రమగు అంతఃకరణము గల నీకు నమస్కారము. పవిత్రము చేయు నీకు అనేక నమస్కారములు (5). చిత్రమగు ఆకారము గల వాడవు, నిత్యుడవు, రూపములకు అతీతమైన వాడవు అగు నీకు నమస్కారము. దివ్య స్వరూపుడవు. దివ్యమగు ఆకారము గలవాడవు అగు నీకు నమస్కారము (6). నమస్కరించిన వారి కష్టముల నన్నిటినీ నశింపచేయువాడు. మంగళ స్వరూపుడు, ముల్లోకములను సృష్టించి భరించి పోషించి లయమును చేయువాడు అగు నీకు అనేక నమస్కారములు (7). భక్తిచే పొందదగినవాడు, భక్తులయెడ దయతో నిండినవాడు, తపస్సునకు యోగ్యమగు ఫలము నొసంగువాడు, పార్వతీపతి, మంగళరూపుడు, జగదీశ్వరుడు అగు నీకు నమస్కారము (8). ఓ శ్రేష్ఠమగు ప్రభువా! నీవు స్తోత్రప్రియుడవు. కాని స్తుతించుట నేను ఎరుంగను. ఓ సర్వేశ్వరా! నీవు ప్రసన్నుడవై శరణు జొచ్చిన నన్ను రక్షింపుము (9).

సనత్కుమార ఉవాచ -

ఇత్యాకర్ణ్య మయోక్తాం హి సంస్తుతిం పరమేశ్వరః | ప్రసన్నో%భూద్ద్విజశ్రేష్ఠ మయం ప్రోవాచ చాదరాత్ || 10

సనత్కుమారుడిట్లు పలికెను -

ఓ బ్రాహ్మణ శ్రేష్ఠా! మయుడు చేసిన ఈ స్తోత్రమును విని పరమేశ్వరుడు ప్రసన్నుడై ప్రేమతో మయుని ఉద్దేశించి ఇట్లు పలికెను (10).

శివ ఉవాచ |

వరం బ్రూహి ప్రసన్నో%హం మయ దానవసత్తమ |
మనో%భిలషితం యత్తే తద్దాస్యామి న సంశయః || 11

శివుడిట్లు పలికెను -

ఓ రాక్షసశ్రేష్ఠా! మయా! నేను ప్రసన్నుడనైతిని. నీ మనస్సునకు నచ్చిన వరమును కోరుకొనుము. నేను ఇచ్చెదను. సంశయము లేదు (11).

సనత్కుమార ఉవాచ |

శ్రుత్వా శివం వచశ్శంభోస్స మయో దనావర్షభః | ప్రత్యువాచ ప్రభుం నత్వా నతస్కంధః కృతాంజలిః || 12

సనత్కుమారుడిట్లు పలికెను -

రాక్షస శ్రేష్ఠుడగు ఆ మయుడు శంభుని ఈ మంగళకరమగు వచనమును విని చేతులు జోడించి ప్రభువునకు సాష్టాంగనమస్కారమును జేసి ఇట్లు బదులిడెను (12).

మయ ఉవాచ |

దేవ వేవ మహాదేవ ప్రసన్నో యది మే భవాన్ |
వరయోగ్యో%స్మ్యహం చేద్ధి స్వభక్తిం దేహి శాశ్వతీమ్ || 13

స్వభ##క్తేషు సదా సఖ్యం దీనేషు చ దయాం సదా |
ఉపేక్షామన్యజీవేషు ఖలేషు పరమేశ్వర || 14

కదాపి నాసురో భావో భ##వేన్మ మ మహేశ్వర | నిర్భయస్సాన్స్యాం సదా నాథ మగ్నస్త్వద్భజనే శుభే || 15

మయుడిట్లు పలికెను -

దేవ దేవా! మహాదేవా! నీవు నా యందు ప్రసన్నుడవైనచో, నేను వరమునకు అర్హుడనైనచో, నాకు నీయందు శాశ్వతభక్తి కలుగునట్లు అనుగ్రహించుము (13). నీ భక్తులతో నిత్యమైత్రిని, దీనుల యెడ సర్వదా దయాభావమును, ఇతరప్రాణులయందు దుష్టులయెడల ఉపేక్షాభావమును ఇమ్ము. ఓ పరమేశ్వరా! (14). నాకు ఎన్నటికి అసుర భావము కలుగకుండు గాక | ఓ మహేశ్వరా! నేనుసర్వదా మంగళకరమగు నీ భజన యందు నిమగ్నుడనై నిర్భయుడనై ఉండెదను గాక! (15).

సనత్కుమార ఉవాచ |

ఇతి సంప్రార్థ్యమానస్తు శంకరః పరమేశ్వరః | ప్రత్యువాచ మయేనాథ ప్రసన్నో భక్తవత్సలః || 16

సనత్కుమారుడిట్లు పలికెను -

మయుడు ఇట్లు ప్రార్థించగా భక్తవత్సలుడు, పరమేశ్వరుడునగు శంకరుడు ప్రసన్నుడై అపుడు ఇట్లు బదులిడెను (16).

మహేశ్వర ఉవాచ |

దానవర్షభ ధన్యస్త్వం మద్భక్తో నిర్వికారవాన్ | ప్రదత్తాస్తే వరాస్సర్వే%భీప్సితా యే తవాధునా || 17

గచ్ఛ త్వం వితలం లోకం రమణీయం దివో%పి హి | సమేతః పరివారేణ నిజేన మమ శాసనాత్ || 18

నిర్భయస్తత్ర సంతిష్ఠ సంహృష్టో భక్తిమాన్ సదా | కదాపి నాసురో భావో భవిష్యతి మదాజ్ఞయా || 19

మహేశ్వరుడిట్లు పలికెను -

రాక్షసశ్రేష్ఠా! నా భక్తుడవగు నీవు ధన్యుడవు, నీ యందు వికారములు లేవు. నీవు ఇపుడు కోరిన వరములనన్నిటినీ నీకు ఇచ్చుచున్నాను (17). నీవు నా శాసనముచే నీ పరివారుముతో గూడి, స్వర్గము కంటె కూడా సుందరమైన వితలలోకమునకు వెళ్లుము (18). నీవు అచట నిర్భయముగా ఆనందముతో జీవించుము. సర్వదా భక్తిని కలిగియుండుము. నా ఆజ్ఞచే నీకు ఏనాడైననూ అసురబావము కలుగనుబోదు (19).

సనత్కుమార ఉవాచ |

ఇత్యాజ్ఞాం శిరసాధాయ శంకరస్య మహాత్మనః | తం ప్రణమ్య సురాంశ్చాపి వతలం ప్రజగామ సః || 20

ఏతస్మిన్నంతరే తే వై ముండిశ్చ సమాగతాః | ప్రణమ్యోచుశ్చ తాన్ సర్వాన్ విష్ణుబ్రహ్మాదికాన్ సురాన్ || 21

కుత్ర యామో వయం దేవాః కర్మ కిం కరవామహే | ఆజ్ఞాపయత నశ్శీఘ్రం భవదాదేశకారకాన్ || 22

కృతం దుష్కర్మ చాస్మాభిర్హే హరే హే విధే సురాః | దైత్యానాం శివభక్తానాం శివభక్తి ర్వినాశితా || 23

కోటికల్పాని నరకే నో వాసస్తు భవిష్యతి | నోద్ధారో భవితా నూనం శివభక్తి విరోధినామ్ || 24

పరం తు భవదిచ్ఛాత ఇదం దుస్కర్మం నః కృతమ్ | తచ్ఛాంతిం కృపయా బ్రూత వయం వశ్శరణాగతాః || 25

తేషాం తద్వచనం శ్రుత్వా విష్ణుబ్రహ్మాదయస్సురాః | అబ్రువన్ముండినస్తాంస్తే స్థితానగ్రే కృతాంజలీన్ || 26

సనత్కుమారుడిట్లు పలికెను -

మహాత్ముడగు శంకరుని ఈ ఆజ్ఞను శిరసా వహించి అతడు దేవతలకు కూడ నమస్కరించి వితలలోకమునకు వెళ్లెను (20).

ఇంతలో ఆ ముండిత శిరస్కులగు సన్న్యాసులు అచటకు వచ్చి బ్రహ్మ, విష్ణువు మొదలగు దేవతలందరికీ ప్రణమిల్లి ఇట్లు పలికిరి (21). దేవతలారా! మేము ఎచ్చటకు పోవలెను? ఏ పనిని చేయవలెను? మీ ఆజ్ఞను నిర్వర్తించు మమ్ములను శీఘ్రముగా ఆజ్ఞాపించుడు (22). ఓ విష్ణూ! ఓ బ్రహ్మా! దేవతలారా! మేము చెడు పనిని చేసితిమి. విభక్తులగు రాక్షసుల శిభక్తిని చెడగొట్టితిమి (23). మాకు కోటికల్పముల వరకు నరకవాసము తప్పదు. శివభక్తి విరోధులమగు మమ్ములను ఉద్ధరించువాడు నిశ్చయముగా ఉండబోడు (24). కాని మీ కోర్కెననుసరించి ఈ చెడు పనిని మేము చేసితిమి. దయతో దానికి ప్రాయశ్చిత్తమును చెప్పుడు. మేము మిమ్ములను శరణు జొచ్చితిమి (25). ఆ సన్న్యాసులు ఇట్లు పలికి చేతులు జోడించి ఎదురుగా నిలబడి. వారి. ఆ మాటలను విని, విష్ణువు బ్రహ్మ మొదలగు దేవతలు ఇట్లు పలికిరి (26).

విష్ణ్వాదయ ఊచుః |

న భేతవ్యం భవద్భిస్తు ముండినో వై కదాచన | శివాజ్ఞయేదం సకలం జాతం చరితముత్తమమ్ || 27

యుష్మాకం భవితా నైవ కుగతిర్దుః ఖదాయినీ | శివాచా యతో యూయం దేవర్షి హితకారకాః || 28

సురర్షిహితకృచ్ఛంభు స్సురర్షి హితకృత్ప్రియః | సురర్షిహితకృన్నౄణాం కదాపి కుగతిర్న హి || 29

అద్యతో మతమేతం హి ప్రవిష్టానాం నృణాం కలౌ | కుగతిర్భవితా బ్రూమస్సత్యం నైవాత్ర సంశయః || 30

భవద్భిర్ముండినో ధీరా గుప్తభావాన్మమాజ్ఞయా | తావన్మరుస్థలీ సేవ్యా కలిర్యావత్సమావ్రజేత్ || 31

ఆగతే చ కలౌ యూయం స్వమతం స్థాపయిష్యథ | కలౌ తు మోహితా మూఢా స్సంగ్రహీష్యంతి వో మతమ్ || 32

ఇత్యాజ్ఞప్తాస్సురేశైశ్చ ముండినస్తే మునీశ్వర | నమస్కృత్య గతాస్తత్ర యతోద్దిష్టం స్వమాశ్రమమ్ || 33

విష్ణువు మొదలగు దేవతలు ఇట్లు పలికిరి -

ఓ సన్న్యాసులారా! మీరు ఎన్నటికీ భయపడకు. ఈ ఉత్తమమగు వృత్తాంతమంతయూ శివుని ఆజ్ఞచే ఘటిల్లినది (27). మీకు దుఃఖదాయకమగు దుర్గతి ఎన్నటికీ కలుగబోదు. ఏలయనగా, మీరు శివుని ఆజ్ఞచే దేవతలకు, ఋషులకు హితమును చేసియున్నారు (28). దేవతలకు, ఋషులకు హితమును చేయు శివునకు దేవర్షులకు హితము చేయువారియందు ప్రీతి మెండు. దేవతలకు, ఋషులకు హితమును చేయు మానవులకు ఎన్నటికీ దుర్గతి కలుగబోదు (29). ఈనాటి నుండియూ కలియుగములో ఈ మతములో ప్రవేశించిన మానవులకు దుర్గతి కలుగును. మేము సత్యమును పలుకుచున్నాము. దీనిలో సందేహము లేదు (30). ధీరులగు ఓ సన్న్యాసులారా! మీరు నా ఆజ్ఞచే కలి వచ్చువరకు ఎడారి ప్రదేశమును ఆశ్రయించి రహస్యముగా ఉండుడు (31). కలి ప్రవేశించగానే మీరు మీ మతమును స్థాపించుడు. మూర్ఖులు అజ్ఞానమునకు వశులై కలియుగములో మీ మతమును స్వీకరించగలరు (32). ఓ మహర్షి! దేవోత్తములు ఇట్లు ఆజ్ఞాపించగా, ఆ సన్న్యాసులు నమస్కరించి, తమకు నిర్దేశంపబడిన నివాస స్థానమునకు వెళ్లిరి (33).

తతస్స భగవాన్ రుద్రో దగ్ధ్వా త్రిపురవాసినః | కృతకృత్యో మహాయోగీ బ్రహ్మాద్యైరభిపూజితః || 34

స్వగణైర్నిఖిలైర్దేవ్యా శివయా సహితః ప్రభుః| కృత్వామర మహత్కార్యం ససుతోంతరధాదథ || 35

తతశ్చాంతర్హితే దేవే పరివారాన్వితే శివే | ధనుశ్శర రథద్వాశ్చ ప్రాకారోంతర్ధిమాగమత్ || 36

తతో బ్రహ్మా హరిర్దేవా మునిగంధర్వకిన్నరాః | నాగా స్సర్పాశ్చాప్సరసస్సంహృష్టాశ్చాథ మానుషాః || 37

స్వం స్వం స్థానం ముదా జగ్ము శ్శంసంత శ్శాంకరం యశః | స్వం స్వం స్థానమనుప్రాప్య నివృత్తి పరమా యయుః || 38

ఏతత్తే కథితం సర్వం చరితం శశిమౌలినః | త్రిపురక్షయసంసూచి పరలీలాన్వితం మహత్ || 39

మహాయోగియగు ఆ రుద్రబగవానుడు త్రిపురవాసులను భస్మము చేసి కృతకృత్యుడై బ్రహ్మాదులచే పూజింపబడెను (34). సర్వగణములతో, పార్వతీ దేవితో మరియు పుత్రులతో కూడియున్న ఆ ప్రభుడు దేవతలకొరకై ఆ మహాకార్యమును నిర్వర్తించి అంతర్ధానమును చెందెను (35). శివదేవుడు పరివారముతో గూడి అంతర్ధానము కాగానే, ధనస్సు, బాణము, రథము మొదలగు సామగ్రి కూడ అంతర్ధానమయ్యెను (36). అపుడు బ్రహ్మ, విష్ణువు, దేవతలు, మునులు, గంధర్వులు, కిన్నరులు, నాగులు, సర్పములు, అప్సరసలు మరియు మానవులు మిక్కిలి సంతసించినవారై (37). శివుని యశస్సును ఆనందముతో గానము చేయుచూ, తమ తమ నెలవులకు బయలుదేరిరి. వారు తమ తమ నెలవులకు చేరి పరమానందమును పొందిరి (38). త్రిపురాసుర సంహారము అనే గొప్ప లీలతో గూడియున్న, చంద్రశేఖరుని మహాచరిత్రమునంతనూ నీకీ తీరున వివరించితిని (39).

ధన్యం యశస్యమాయుష్యం ధనధాన్య ప్రవర్ధకమ్ | స్వర్గదం మోక్షదం చాపి కిం భూయశ్శ్రోతు మిచ్ఛసి || 40

ఇదం హి పరమాఖ్యానం యః పఠేచ్ఛృణుయాత్సదా | ఇహ భుక్త్వాఖిలాన్ కామానంతే ముక్తి మవాప్నుయాత్ || 41

ఇతి శ్రీ శివమహాపురాణ రుద్ర సంహితాయాం యుద్ధ ఖండే మయస్తుతి వర్ణనం నామ ద్వాదశో%ధ్యాయః (12).

ఈ ధన్యమగు వృత్తాంతము కీర్తిని, ఆయుర్దాయమును ఇచ్చి ధనధాన్యములను వృద్ధి పొందించుటయే గాక, స్వర్గమును మోక్షమును కూడ ఇచ్చును. నీవు ఇంకనూ ఏమి

వినగోరుచున్నావు? (40) ఈ గొప్ప వృత్తాంతమును నిత్యము పఠించువాడు, మరియు వినువాడు ఇహలోకములో సమస్త భోగముల ననుభవించి, దేహత్యాగానంతరము మోక్షమును పొందును (41).

శ్రీ శివ మహాపురాణములో రుద్ర సంహితయందలి యుద్ధఖండములో మయస్తుతివర్ణనమనే పన్నెండవ అధ్యాయము ముగిసినది (12).